అణువణువూ వేదనాదం
అణువణువూ వేదనాదం

అణువణువూ వేదనాదమే
వేదనాదం
మానవాళికి పరమాత్ముడు ప్రసాదించిన తొట్టితొలి గ్రంథం వేదం. భారదేశంలో ఉదయించిన ఆ వెలుగు లోకమంతా ప్రవాశాన్ని చిమ్ముతోంది. ఇంతకీ వేదాలు ఎవరు రాశారు? వేదం ఏం చెబుతోంది? వేదకాలం ఏది?....వీటి గురించి మనకు తెలిసింది కొంతే. తెలియనిది కొండంత. వేదం జీవనాదాన్ని వినిపిస్తోంది. ఉదాహరణకు ఈ క్రింది శ్లోకం...

దృశ్యేన శరదాంశతం
సున్యామ శరదాంశతం
ప్రబ్రవామ శరదాంశతం
అదీనాశ్యామ శరదః శతం
భూయామ శరదః శతం

మనిషి నూరేళ్ళు బట్టలుకాలంటే 'చక్కాగా చూస్తూ, చక్కగా వింటూ, మంచి మాట్లాడుతూ, ఎవరికీ అధీనుడు కాకుండా బతకాలి' అని అర్థం. నిజంగా ప్రతి మనిషి ఇలా బతకగలిగితే మరో వందేళ్ళు బతుకుతావని కూడా అర్థం. ఎంత బాగా చెప్పబడింది కదా! వేద సూక్తులు జీవన విధానాన్ని బోధిస్తున్నాయి. దంత ధావనం దగ్గర నుంచి వస్త్రం, కుటుంబం, బంధుత్వం, గ్రామం రాజ్యం...ఇలా అన్నింటినీ ఇది స్ఖృశించింది. వేదం అనేది రామాయణం, భాగవతాల వంటిది కాదు. ఎవరో ఒకరే కవి రాసినది కాదు. అది నిరంతర ప్రవాహ ధార. అది శాంతి, సౌభాగ్యాలను బోధిస్తుంది. వేదానికి అపౌరుషేయం అని పేరు. అంటే మానవమాత్రుడు చెప్పింది కాదు. యుగయుగాలుగా మహరుషులు తమ దివ్యదృష్టితో దర్శించిన కావ్యాలు వేదాలు.

వేదాలు నాలుగు:
1. ఋగ్వేదం: దేవతల గుణగణాలు ఇందిలో ప్రత్యేకం. అగ్ని దేవుడి ప్రార్ధనతో ఈ వేదం ప్రారంభమవుతుంది. ఇందులో 1017 సూక్లా, 10,580 మంత్రాలు, 1,53,826 శబ్దాలు, 43,200 అక్షరాలు ఉన్నాయి. ఋగ్వేదంలొ ఉండే మంత్రాలను రుక్కులు అని కూడా అంటారు. ఇవి ఛందోబద్ధాలు.
2. యజుర్వేదం: ఇది యజ్ఞయాగాదులు గురించి వివరిస్తుంది. ఇందులో రెండు శాఖలు ఉన్నాయి. అవి 1. శుక్ల యజుర్వేదం (యాజ్ఞ వల్క్య మహర్షి). ఇందులో 1975 పద్యగద్యాలున్నాయి. 2. యజుర్వేదం (త్తైత్తరీయ మహర్షి). ఇందులో 2198 మంత్రాలు, 19,200 పదాలు ఉన్నాయి.
3. సామవేదం: ఇది అతి చిన్నది. సమం అంటె గ్రామం. ఇందుల్రో మంత్రాలు 1875 ఉన్నాయి. వీతిలో 1504 ఋగ్వేద మంత్రాలే. 99 మాత్రమే కొత్తవి. 272 పునరుక్తాలు. భారతీయ సంగీత శాస్త్రానికి సామవేదమే మూలం. ఇది శాంతి వేదం.
4. అధర్వణ వేదం: లౌకిక విష్యాలను ఇది వర్ణిస్తుంది. 5977 మంత్రాలు ఉన్నాయి. అనేక చికిత్సావిధానాలు ఉన్నాయి. మూలికా చికిత్స కొడా ఇందులో వర్ణించి ఉంది. రాజ్యం, రాజ్యాంగం, రాజకీయ వ్యవస్థల గురించి వివరంగా వర్ణనలు ఉన్నాయి. దీనినే బ్రహ్మ వేదమని కూడా అంటారు. రాజ్యం, రాజకీయాల గురించి వివరించినందుకు క్షత్ర వెదమని, చికితల గురించి వివరిస్తుంది కాబట్టి భిషగ్వేదమని కూడా పిలుస్తారు. వేదాలను అర్థం చేసుకోవడం సామాన్యులకు ఒకింత కష్టమే. అందుకే వీటిని చదివి అర్థం చేసుకోవడానికి మహర్షులు ఒక నిర్దిష్ట పద్ధతిని ఏర్పరిచారు. దీని ప్రకారమే ఆరు వేదాంగాలు, నాలుగు ఉపవేదాలు ఉన్నాయి.
వేదాంగాలు 6:
1. శిక్ష,
2. వ్యాకరణం,
3. నిఘంటు,
4. ఛందస్సు,

5. జ్యోతిషం,
6. కల్పం.
ఉపవేదాలు 4:
1. గాంధర్వ వేదం,
2. ఆయుర్వేదం,
3. ధనుర్వేదం,
4. అర్థవేదం.అథర్వణ వేదమే.- ఈ నాలుగు ఉప వేదాలకు మూలమని భావిస్తారు.